**Jahez Aur Wirasat Islami Nuqte Nazar se**
**(Telugu)**

# కట్నకానుకలు ! వారసుల ఆస్తిహక్కులు

మూలం
**ముఫ్తీ ముహమ్మద్ ముష్తాఖ్ తిజార్వి**

అనువాదం
**ఎస్.ఎమ్. ఖాద్రి**

అనంత కరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# కట్నకానుకలు! వారసుల ఆస్తిహక్కులు

## ఇస్లామ్ దృష్టిలో కట్నకానుకలు

కాలానుగుణంగానూ, ఇతర సమాజ సంప్రదాయాల ద్వారానూ ముఖ్యంగా సహవాసదోషం వల్ల అనేక రుగ్మతలు ముస్లిముల ఆచరణలోనికి వచ్చిచేరాయి. ఈ దుష్టసంప్రదాయాల్లో కట్నకానుకలు (జహేజు) అనే సంప్రదాయం ఒకటి. ఇది ముస్లిమ్ సమాజంలో ఓ రాక్షసిపుండులా వ్యాపించి మన సమాజ పునాదుల్నే డొల్లగా మార్చివేసింది. ఈవిధంగా అనేక సామాజిక విలువలు తారుమారయ్యాయి. ముస్లింలు పాటిస్తున్న ఆచరణలు, వారి ఆదేశాలు బాహాటంగా పరిహాసానికి గురై పోయాయి.

జహేజు శాపం ముస్లిమ్ సమాజానికి చెందిన ఏదో ఒక వర్గానికే పరిమితంగాలేదు. నిజం చెప్పాలంటే, ముస్లింల ఏ వర్గమూ దీనికి లోను కాకుండాలేదు. చివరకు ముస్లిమ్ సమాజాన్ని నియంత్రించే పెద్ద మనుషులు, నాయకులు కూడా ఈ దుష్టసంప్రదాయానికి అలవాటయ్యారు.

'జహేజు' అనేది ఓ సంప్రదాయం. అయితే ఇది ఫివాహానికి సంబంధించిన అన్ని దుష్ట సంప్రదాయాలకు మూలం అని అనడమే ఉచితమైనది. కాబట్టి, పెళ్ళికి సంబంధించిన రకరకాల సంప్రదాయాలన్నిటినీ గనుక మీరు బేరీజు వేసుకుంటే ఈ దుష్టసంప్రదాయాల సంబంధం ఏదో ఒక రకంగా జహేజుతో ముడివడే ఉందని గ్రహిస్తారు.

జహేజు పూర్తిగా ఓ భారతీయ సంప్రదాయం. హిందూసమాజంలో ఇది ప్రాచీన కాలంనుండే కొనసాగుతూ వస్తోంది. ఈవిధంగా చూస్తే హిందూ పురాణాల్లో 'కన్యాదానం' వగైరా పేర్లు ఉన్నాయి దీనికి. అయితే జహేజు అనే పదం అరబిక్ బాషకు చెందింది. బహుశా ఇది 'జహేజ్' అనే పదం నుండి సేకరించబడి ఉండవచ్చు. దీనికి సరిపోయే పదం ఉర్దూలోను ఉంది. అది 'తజ్హీజ్'. తజ్హీజ్ అంటే శవానికి కఫన్ వస్త్రాలు తొడగడం, ఖనన సముదాయాలను సమకూర్చడం.

జహేజు అనే పదానికి అసలు మూలపదం 'జహ్హాజ'. దీనికి అర్థం సామానులు వగైరాలు సమకూర్చడం అని. అలాగే వధువు కోసం 'జిహాజుల్ బైతుల్ ఉరూస్' (వధువు కొరకు సమకూర్చే గృహోపకరణాలు, అలంకరణా వస్తువులు)గా కూడా చెప్పవచ్చు. అలాగే 'అల్ జిహాజుల్ ఉరూసు మాయుహ్తాజ ఇలైహి' (వధువుకు అవసరమైన వస్తు సామాగ్రిని సమకూర్చడం) ఇలా ఈ పదం దాని మూలం ప్రకారం అరబిక్ పదమే. భారతదేశంలో మతం, వర్గం అనే తేడాలేకుండా దీన్ని అందరూ జహేజ్ అనే అంటారు. ఆ పదమే రూపాంతరం చెంది హిందీభాషలో 'దహేజు' అయింది. వీటన్నింటిని దృష్టిలో ఉంచుకొని చూస్తే 'జహ్హాజ' అనేది పెళ్ళప్పుడు వధువు తరపువారు ఆమె వరుని ఇంటికి వచ్చేసమయంలో ఇచ్చే వస్తుసామాగ్రి అని చెప్పవచ్చు. భాతర దేశంలో ప్రస్తుతం అమలులో

ఉన్న సంప్రదాయం పూర్తిగా భిన్నమైంది. ఇలాంటి జహేజు సంప్రదాయం భారత ఉపఖండంలో తప్ప మరెక్కడా కానరాదు. ఒకవేళ అది ఎక్కడైనా అమలులో ఉన్నా దానిపై ఈ ప్రభావాలు కూడా పడ్డాయి.

జహేజు పూర్తిగా ఓ ఇస్లామేతర సంప్రదాయం. దాని పునాదులన్నీ తప్పుడు పునాదులే. ఇస్లామ్ వివాహాన్ని పూర్తిగా పురుషుని ఆర్థిక జీవితంతో ముడిపెట్టింది. హదీసులో ఇలా ఉంది.

"ఓ యువకుల్లారా! మీలో ఎవరైతే ఇంటి బాధ్యతలు మోసే స్తోమత కలిగి ఉన్నారో వీరు తప్పకుండా వివాహం చేసుకోవాలి" (మిష్కాత్)

ఇంటి ఖర్చులు, పెళ్ళి ఖర్చులు భరించే బాధ్యత పూర్తిగా భర్తదే. భార్యను పోషించడం, ఇంటిఖర్చులను భరించే బాధ్యత తప్పనిసరిగా పురుషునిదే (వాజిబ్). అలాగే పెళ్ళిసమయంలో అతను భార్యకు మహర్ కూడా చెల్లించాల్సి ఉంటుంది. ఆర్థిక బాధ్యత పురుషునిదే అనడానికి సంకేతమిది. పెళ్ళైన తరువాత భర్త వలీమా చేయడం సున్నత్. అంటే, అతను వలీమా చేయాలి అని. భర్త భరిస్తున్న ఈ ఖర్చులన్నిటిని చూస్తే భార్యపై కాకుండా ఆ ఆర్థిక భారం పూర్తిగా భర్తపైన్నే పడుతుంది అన్న అంశం అవగతం అవుతోంది.

భర్త భార్యపై పెట్టే ఖర్చులేమిటో ధార్మిక పండితులు రకరకాలుగా విభజించడం జరిగింది. వాటిని దృష్టిలో ఉంచుకుంటే, ఇంటిని నడిపే బాధ్యత పూర్తిగా భర్తదే అనే విషయం అర్థమవుతుంది. 'అబూజహ్రా' అనే పండితుడు, హనఫీ పంథాకు చెందిన ధార్మికవేత్తల నిర్ణయాలను ఈరకంగా ఉటంకించారు.

"హనఫీ పండితులు చెప్పిన దానిప్రకారం ఇల్లు, ఇంటిసామానుల

సమకూర్చు భర్త బాధ్యత. కారణం, తినడానికి తిండి, తొడగడానికి వస్త్రాలు, ఉండడానికి ఇల్లు లాంటివన్నీ భరించడం భర్తపై వాజిబ్ (అంటే అనివార్య మైనది) కాబట్టి. గృహోపకరణాలు ఇంటికి అవసరమైనవే. వాటిని సమకూర్చడం కూడా భర్త బాధ్యతే. 'మహర్' జహేజుకు ప్రత్నామ్నాయం కాబోదు. ఎందుకంటే అది కేవలం 'అతియా' (బహుమానం) మాత్రమే. దివ్యఖుర్అన్ దాన్ని 'నహ్లా' (బహుమానం)గా చెప్పడం జరిగింది. అది కేవలం భార్య సొత్తు. భర్తకు దానిపై ఎలాంటి హక్కుల్లేవు. స్త్రీయే తన ఇంటి సదుపాయాలను సమకూర్చుకోవాలని ధర్మశాస్త్రాల్లో ఎక్కడా కానరాదు. కాబట్టి ఎలాంటి ఆధారం లేకుండా దాన్ని భార్యే సమకూర్చుకోవాలనే వాదన బలంలేని వాదన." (అల్ అహ్వాలుల్ షఖ్సియ్యా పేజీ- 238)

కొందరు ధార్మికవేత్తలు మిశ్రమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. వాటిప్రకారం భార్య తరపున లేదా భార్య సంరక్షకుల తరపున కానుకలు పొందే సౌకర్యం ఉన్నట్లు కానవస్తోంది. అయితే, భారత ఉపఖండంలో ప్రస్తుతం అమలులో ఉన్న జహేజుకు ఏమాత్రం చట్టబద్ధతలేదు. ప్రస్తుత సంప్రదాయక జహేజు ఒక శాపం. ఇది సమాజాన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకోవడం వలన అనేకానేక రుగ్మతలు పొడసూపుతున్నాయి. జహేజు ఇప్పుడు ఇంటి అవసరాలు కాకుండా దోపిడీ, దుబారా, ప్రదర్శనాబుద్ధి మరియు పెత్తనం చెలాయించే ఓ సూచనగా మిగిలిపోయింది.

జహేజు, ఇంటికి కావలసిన నిత్యావసర వస్తువులకే పరిమితంగా లేదు. అసలు వత్తిడంతా అవసరంలేని గృహోపకరణాలపైన్నే. కారు, ఫ్రిజ్జు, టీవి, బంగళా అలాగే అనేక విలువైన వస్తుసామాగ్రి జహేజులో తప్పనిసరై పోయింది. ధనవంతులు వాటిని వధువుకు ఇస్తూ తమ డాంబికాన్ని, సంపన్నతను చాటుకుంటున్నారు. ఒకరు మరొకరిని మించిపోవడానికే

ప్రయత్నం చేస్తున్నారు. సమాజంలో ఇలాంటి సంప్రదాయం చోటు చేసుకోవడం వలన ఆర్థికంగా చితికి ఉన్న బలహీనులు కూడా వాటిని సమకూర్చేందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఇది వారిపై ఒక ఆర్థిక భారంగా మిగిలిపోతోంది. అప్పుడప్పుడు జహేజు కోసం ప్రజలు తమ ఇండ్లను, ఆస్తిపాస్తులను కూడా వదులుకోవలసి వస్తోంది. ఇలాంటి సందర్భాల్లో వడ్డీవ్యాపారుల పంట కూడా బాగా పండుతోంది. వీరు ప్రజలను మరింతగా పురికొల్పి పెద్ద వడ్డీలపై అప్పునిస్తున్నారు. అప్పు తీసుకోవడం చాలా సులభం. కాని దాన్ని తీర్చడం మాత్రం కష్టమైనది. ముఖ్యంగా వడ్డీ వ్యాపారుల అప్పు తీర్చడం మరింత కష్టంతో కూడుకున్నది. ఇది వరద నీటిలా పెరుగుతూనే పోతుంది.

పెద్ద జహేజు ఇచ్చినా, చిన్న జహేజు ఇచ్చినా ఆ రెండు సందర్భాల్లోనూ ఆ జహేజుకు పెట్టే ఖర్చుకంటే అతనికి అయ్యే ఖర్చు బోలెడంత. బరాత్, పెళ్లి కుమారుని తరపువారికి (వియ్యాలవారికి) విందుభోజనాలు సమకూర్చడం, అలాగే ఇతరులకు చూపెట్టాలనే ఉద్దేశ్యంతో డాంబికాలకు పోవడంలోనే బోలెడు ధనం తగలబడిపోతుంది. ఇది పూర్తిగా 'ఇస్రాఫ్' (దుబారా) కిందికి వచ్చే ఖర్చు.

జహేజు ఉపకరణాలు, దానికితోడు వరునికి కట్నంగా సమర్పించుకునే డబ్బు (జోడేకీ రఖం) పెళ్ళికుమారుని స్థాయికి, హోదాకు, అతని ఉద్యోగానికి తగ్గట్టుగా పెరిగిపోతుంది. ప్రస్తుతం ఉన్న పరిస్థితి ఏమిటంటే అబ్బాయిలు తమ స్థాయిని బట్టి సంతసరుకుగా మారిపోవడం వలన అమ్మాయి తరుపువారు అతడ్ని కొంటున్నారు. సాధ్యమైనంత ఎక్కువ జహేజు ఇచ్చి, వరకట్నం పేరున పెద్దమొత్తంలో నగదును ముట్టజెప్పి (దాన్నే ఉత్తర భారత దేశంలో తిలక్ అని అంటారు. మన దగ్గర అది జోడేకీ

రఖం) విద్యావంతులు, ఉద్యోగం చేసే యువకులకు పాటబెట్టి మరీ కొంటున్నారు. డాక్టర్, ఇంజనీరు, ఉన్నతోద్యోగులైన యువకులను తమ అల్లుళ్ళుగా చేసుకునే ప్రయత్నం చేస్తున్నారు. తమ బ్యాంకు బ్యాలన్సులను వారి కొరకు తెరిచేస్తున్నారు.

నికాహ్ అంటే ఓ 'షరయీ' (ధర్మసమ్మతమైన) ఆరాధన. దాని పునాదులపైన్నే సమాజాలు, కుటుంబాలు ఉనికిలోనికి వస్తాయి. అంటే కుటుంబం ఒక యూనిట్ లాంటిది. దాన్ని గురించి దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు.

**"నిరాడంబరమైనది, తక్కువ ఖర్చులతో కూడినది అయిన నికాహ్ అన్నిటికంటే శుభప్రదమైన నికాహ్"**

సమాజంలో జహేజు సంప్రదాయం బాగా పెరిగిపోవడం వలననే దుబారా వ్యయం సర్వసాధారణమైపోయింది. దీనికి కారణం ప్రజల్లో దురాశ, పేరాశలు పెరిగిపోవడం. జహేజు వస్తుందనే ఆశతో ప్రజలు అన్నింటికంటే మంచి సంబంధాలు వెదకడం రివాజైపోయింది. ధర్మంపై గాని, బంధువులపైగాని వారి దృష్టిపోవడంలేదు. ఇచ్చేవాడు ఎంత ఇచ్చినా, తీసుకునేవాని ఆశ మాత్రం చల్లారడంలేదు. అతను ఇంకా కావాలనే కోరుకుంటున్నాడు. ప్రతివాని రాబడి పరిమితంగానే ఉంటుంది. జహేజును కోరేవాని గొంతెమ్మ కోరికలను తీర్చడం అన్నివేళలా అతనికి సాధ్యమయ్యేది కాదు. చివరికి ఆ జహేజు కారణంగానే వ్యవహారం తలాక్ లేదా ఆలుమగల వేర్పాటు వరకు వెడుతుంది. కేవలం జహేజు తీసుకు రానందుకు వధువును కాల్చి చంపే సంఘటనలు ఎన్ని జరగడంలేదు? మనదేశంలో అలాంటి ఉదాహరణలు కోకొల్లలు. అదేకాదు, పెళ్ళికి కావలసిన జహేజు సమకూరకపోవడం వలన అమ్మాయిలు ఆత్మహత్య

లకు పాల్పడడం కూడా జరుగుతోంది. ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో, ఈ సంక్షోభం కారణంగా హత్యల్లాంటి నేరాలు కూడా బయటపడుతున్నాయి. పెళ్ళి అనేది నూరేళ్ళ పంట. దానికి బదులు జహేజు అనే సరంజామా ఇంటినే సర్వనాశనం చేసి పారేస్తుంది. ఈ రుగ్మతను సమూలంగా పెరికి పారవేసి ప్రజల్లో జాగృతిని కలిగించే అవసరం ఎంతైనా ఉంది.

ఈ సమస్య కేవలం జహేజు ఇచ్చేవారిదేకాదు, జహేజు తీసుకునే వారిదీను. ఎందుకంటే, జహేజును తీసుకునేవాడు కూడా తన కుమార్తె లేదా చెల్లెలి పెళ్ళికి అలాంటి జహేజును సమకూర్చాల్సి ఉంటుంది. ఇలా దౌర్జన్యం చేసేవారంతా ఆ దౌర్జన్యాగ్నికి సమిధలు కావలసిందేనన్న విష యాన్ని గమనించాలి. ఈ దౌర్జన్యం చేసేవారు, ఆ దౌర్జన్యానికి బలయ్యే వారు ఉభయులూ ఈ రక్కసి కోరల్లో పడి పీడించబడేవారే. ఇది ప్రతి వ్యక్తినీ పట్టిపీడిస్తూ ఉన్నదే. సమాజాన్ని దీని కర్కశ కోరలనుండి రక్షించుకోవలసిన అవసరం అందరిమీద ఉంది.

జహేజు పుచ్చుకోవడం న్యాయబద్ధమైనదే అని కొందరు కొన్ని కారణాలను చూపెట్టి వాదిస్తారు. ఉదాహరణకు దైవప్రవక్త(స) కూడా తమ ముద్దుల కుమార్తె హజ్రత్ ఫాతిమా(ర)కు జహేజు ఇచ్చారు అన్నది వారి వాదన. ఇది దైవప్రవక్త(స)వారిపై అపనింద మోపడం లాంటిది. పాపాన్ని పుణ్యంగా మార్చే వాదనల్లో ఇదొకటి. అసలు విషయం ఏమిటంటే, ఆయన(స)కు ఒక హజ్రత్ ఫాతిమా(ర)యే కాకుండా మరి ముగ్గురు కుమార్తెలూ ఉన్నారు. వారి నికాహ్ సందర్భంగా ఏ ఒక్కరికీ జహేజు ఇచ్చిన దాఖలాలు లేవు. ఇది మొదటి విషయం. ఇక రెండవ విషయం ఏమిటంటే, దైవప్రవక్త(స) వారు చేసుకున్న నికాహ్‌లలో దేనిలోను జహేజుకు సంబంధించిన ఆధారం లభించదు. కేవలం హజ్రత్ ఫాతిమా(ర)

గారికే ఆయన(స) ఏయే వస్తువులైతే ఇచ్చారో యదార్థంగా వాటిని ఆయన ఇచ్చినవికావు. అన్ని హజ్రత్ అలీ(ర)గారి సొమ్ముతో కొనబడిన వస్తువులే. అది జహేజు ఎలా అయింది? భర్త కొన్న గృహోపకరణాల క్రిందికే వస్తాయవి. షరీఅత్ ప్రకారం అవి ధర్మసమ్మతమైనవే. హజ్రత్ అలి(ర)గారి నికాహ్‌కు సంబంధించిన వివరాలు అనేక గ్రంథాల్లో లభిస్తాయి. వాటిలో వివరంగా చెప్పబడిన విషయం ఏమిటంటే, హజ్రత్ అలి(ర) వారు దైవ ప్రవక్త(స) వద్దకు పెళ్ళి సంబంధం పంపించినప్పుడు మహాప్రవక్త(స), ఇంటి ఖర్చులు, ఇల్లు వగైరాలకు అలి(ర) వద్ద ఏదైనా ఉందా అని అడిగారు. హజ్రత్ అలి(ర) దగ్గర ఒక కవచం తప్ప మరేదీలేదు. ఆయన ఆ కవచాన్నే ప్రవక్త(స)కు ఇచ్చివేశారు. దాన్ని విక్రయించగా వచ్చిన సొమ్ము మొత్తం 480 దిర్హమ్‌లు. అందులో నుండి రెండు పిడికిళ్ళ దిర్హంలను తన ఇంటికి కావలసిన వస్తవుల్ని కొనమని హజ్రత్ అలి(ర)గారి చేతికిచ్చారు దైవప్రవక్త(స). ఆయన ఆ సొమ్మును హజ్రత్ అబూబక్ర్(ర)గారి చేతికి ఇచ్చారు. హజ్రత్ అబూబక్ర్(ర) ఆ డబ్బుతో ఓ తోలుదిండు, ఓ నలుపురంగు యమనీ దుప్పటి, ఓ మంచం, ఓ నీళ్ళకూజా, ఓ వస్త్రం మరో నీళ్ళు నింపుకునే తోలు తిత్తిని కొన్నారు. ఇవన్నీ ఇంటికి కావలసిన ప్రాథమిక అవసరాలే. ఇంకొంత డబ్బుబెట్టి సువాసన ద్రవ్యాన్ని కొన్నారు. మిగిలిన డబ్బంతా మహర్ క్రింద హజ్రత్ ఫాతిమాకు ఇచ్చివేయడం జరిగింది. (షరహ్ మవాహిబ్ 2/3,4)

ఈ సంఘటన గురించి అందరూ చెబుతున్న విషయం ఏమిటంటే, అవన్నీ హజ్రత్ అలి(ర)గారు అమ్మిన జిరహ్ (కవచం)తో వచ్చిన డబ్బు బెట్టి కొన్నవే. హజ్రత్ ఫాతిమా(ర) గారిని సాగనంపేటప్పుడు ఆమెకు అవసరమైన వస్తుసామగ్రే అది. ప్రస్తుతం రివాజులో ఉన్న జ.హేజుకు దానికి ఎలాంటి సంబంధమైనా ఉందా?

అయితే ఇక్కడ ఉద్భవించే ప్రశ్న ఏమిటంటే, కేవలం హజ్రత్ అలి(ర)గారికే ఆ జహేజు ఎందుకు ఇవ్వడం జరిగింది? ఇతర పెళ్ళిళ్ళలో దాన్ని ఎందుకు ఇవ్వలేదు? అన్నది. దీనికీ ఓ ప్రబల కారణం ఉంది. వాస్తవం ఏమిటంటే, హజ్రత్ అబూతాలిబ్ (హజ్రత్ అలి(ర)గారి తండ్రి)కు సంతానం ఎక్కువ. బాల్యంలోనే దైవప్రవక్త(స)వారి బాగోగులను చూసిన వారు అబూతాలిబ్. దైవప్రవక్త(స) పెరిగి పెద్దయ్యాక అబూతాలిబ్ గారి బరువుభారాన్ని తగ్గించే ఉద్దేశ్యంతో హజ్రత్ అలి(ర)ని తెచ్చి తమ ఇంట ఉంచుకున్నారు. ఈరకంగా దైవప్రవక్త(స) వారి ఇల్లే హజ్రత్ అలి(ర)గారికి సొంత ఇల్లయిపోయింది. పెళ్ళైన తరువాత హజ్రత్ అలి(ర) క్రొత్త సంసారాన్ని పెట్టుకోవలసి వచ్చింది. ఈ సందర్భంగా ఆయనకు ఓ ఇల్లు కూడా కట్టి ఇవ్వడం జరిగింది. ఈ రోజుల్లో ఉమ్మడి కుటుంబాలు వేరు పడినట్టే ఇదీను. అందుకని ఆ ఇంటికి కావలసిన వస్తువుల్ని సమకూర్చడం అవసరమైంది. అయితే ఈ వస్తువులన్నీ హజ్రత్ అలి(ర)గారే సమకూర్చుకున్నారన్నది పరిగణనలోనికి తీసుకోవలసిన విషయం.

జహేజు ధర్మసమ్మతం అని వాదించేవారి వాదనల్లో రెండవది ఆస్తిపంపకానికి సంబంధించిన వాదన. భారతదేశంలో ఆడపిల్లలకు ఆస్తిని పంచిపెట్టే ఆచారంలేదు. అందుకని దానికి బదులు మేము ఆమెకు జహేజు రూపంలో కొంత ముట్టజెపుతున్నాం అని అంటారు. ఈ సాకు కూడా సరైందికాదు.

1. ఆస్తిపంపకం జరిగేది ఆ ఆస్తిగలవాడు మరణించిన తరువాతే. దీన్ని ఆడపిల్లకు అతను బ్రతికుండగానే ఇవ్వడం, దానితోనే సరిపుచ్చు కోవడం పూర్తిగా ధర్మవిరుద్ధమైనది.

2. వారసత్వపు హక్కులేమిటో దైవమే తన గ్రంథంలో ఖరారు చేయడమయింది. వాటిని పెంచడంగాని, తగ్గించడంగాని చేయడం అధర్మం. ఆస్తిగలవాడు మరణించిన తరువాత అతని అమ్మాయికి వచ్చేవాటా ఎంతో మనకు తెలిసేదికాదు. జహేజు, మీరాస్‌కు (ఆస్తిపంపకానికి) ప్రత్యామ్నాయం కాజాలదు.

చెప్పబడే మూడవ విషయం ఏమంటే, ఇది కేవలం ఒక హదియా (కానుక లేదా ప్రజెంటేషన్లు) అదే అమ్మాయి తరఫువారు అబ్బాయికి ఇస్తున్నారు అన్నది. అయితే ఈ వాదనకు కూడా ఎలాంటి బలంలేదు. ఎందుకంటే, కానుకలుగా ఇచ్చే వస్తువులకూ, జహేజులో ఇచ్చే వస్తువులకూ ఎలాంటి పొంతనే ఉండదు. జహేజులో జీవితావసర వస్తువులే కాకుండా కారు, మోటారు బైకు, ఫ్రిజ్జు, టీ.వి.లాంటి విలువైన వస్తువుల నిచ్చే ఆనవాయితీ ఎక్కువైపోయింది. ఇవన్నీ కానుకలకంటే బోలెడు విలువైన వస్తువులు. (అంటే కానుకలుగా ఈ వస్తువులు ఇవ్వబడేవి కావు).

వాదించబడే విషయం మరొకటుంది. అది, 'ఔను డిమాండు చేయడం నిజంగా తప్పేకాని ఎవరైనా మేము వాదిస్తున్నప్పటికి కావాలని జహేజు ఇస్తుంటే దాన్ని తీసుకోవడంలో తప్పేముంది?' అన్నది. ఈ వాదన కూడా సరైందికాదు. ఎవరైనా, "నేను జహేజును డిమాండు చేయను, ఇస్తే మాత్రం తీసుకుంటాను" అని చెప్పడం అంటే అతను జహేజును డిమాండు చేస్తున్నట్లే లెక్క. సాధారణంగా పెండ్లిళ్ళలో జహేజు ఇచ్చే ఆచారం ఉంది. దీన్ని తప్పకుండా ఇవ్వాలన్నది ఓ సంప్రదాయంగా మారిపోయింది. ఆ సంప్రదాయాన్ని పేరుబెట్టి 'ఫికాహ్' (ధర్మశాస్త్రం)లో చెప్పబడనప్పటికీ అది ధర్మవ్యతిరేకమైన సంప్రదాయమే అవుతుంది.

ఈ చెడు సంప్రదాయాన్ని రూపుమాపాలంటే, జహేజును పొందే వారు అసలు దాన్ని తీసుకోకుండానే ఉండాలి. ఇది వారి ధార్మిక విధి. కాబట్టి సాధ్యమైనంత మట్టుకు ఆ కృషి జరుగవలసి ఉంది. అదేకాదు, ఇది ఓ సంక్షోభాన్ని తుదముట్టించే ప్రయత్నంలాంటిది. అదేవిధంగా జహేజును ఇచ్చేవారు కూడా దృష్టిలో ఉంచుకోవాల్సిన విషయం ఏమిటంటే, ప్రతివాడు జహేజును ఇచ్చే స్తోమతను కలిగి ఉండడు అన్నది. డబ్బున్నవారు జహేజు ఇవ్వడం మానివేస్తే, డబ్బులేనివారి పెళ్ళిసంబంధాలు కూడా సులువుగా కుదురుతాయి. అంతేగాని, జహేజు ఇవ్వకపోతే మన ఆత్మగౌరవం దెబ్బతింటుందని, బంధువుల్లో మన పరువు పోతుందని అనుకోకూడదు. ఎవరైనా ఈ పంథాను అనుసరిస్తే అతనికి సమాజంలో మరింత గౌరవం దక్కుతుంది. ప్రజలు అతణ్ణి పెద్దమనిషిలా గౌరవిస్తారు. అయితే, బంధుమిత్రులు ఎంత అవహేళన చేసినా, అతను మాత్రం తన పరలోక సాఫల్యం గురించే ఆలోచించాలి. ఒకటి రెండు రోజుల వరకు వారు అలా మీ గురించి ఎగతాళి చేసినప్పటికీ ఆ తరువాత మిమ్మల్ని మరిచిపోయి మరో అంశం గురించిన చర్చలో పడిపోతారు.

కొందరైతే, "మేము మా అబ్బాయి చదువుకు బోలెడు ధనాన్ని ఖర్చుబెట్టాం, వధువు వరకట్నం ఏదీ తీసుకురాకపోతే ఆ ఖర్చులు ఎలా పూడుతాయి?" అని ఆలోచిస్తూ ఉంటారు. అలాంటి వారు మహాప్రవక్త ముహమ్మద్(స)వారి ఈ ప్రవచనాన్ని గుర్తుంచుకోవాలి. ఆయన(స) ఇలా సెలవిచ్చారు:

"ఎవరైనా ధనం కోసమే ఓ స్త్రీని పెళ్ళాడితే, అల్లాహ్ కేవలం అతని దారిద్ర్యాన్నే పెంచుతాడు."

పైన చెప్పిన కొన్ని కోణాల ద్వారా, జహేజు ఇవ్వడం దాన్ని పుచ్చుకోవడం రెండూ ధర్మసమ్మతం కాని విషయాలే అని తేటతెల్లమవుతోంది. జహేజు సమాజాన్ని పట్టిపీడిస్తున్న ఓ భయంకరమైన వ్యాధి. ఇది సమాజ వ్యవస్థనంతా ఛిన్నాభిన్నం చేసివేసింది. నికాహ్ అనే పవిత్ర బంధం ఓ వ్యాపారంగా మారిపోయింది. పేదలు, బలహీనులు తమ యుక్త వయస్సుకు వచ్చిన ఆడపిల్లల పెండ్లిళ్ళు చేయడం కష్టమైపోయింది. జహేజు కారణంగా సమాజంలో దుబారా ఖర్చులు అధికమైపోయాయి. ప్రస్తుతం పెళ్ళంటే వినాశనం తప్ప మరేదికాదన్నట్లు అగుపడుతోంది. ఇరువైపులవారు ఎలాంటి ప్రబల కారణం లేకుండానే డబ్బును నీళ్ళ ప్రాయంగా ఖర్చుచేస్తున్నారు. అందుకు కావలసిన సొమ్ము తమ వద్ద లేకపోతే పెండ్లినే వాయిదా వేస్తున్నారు.

జహేజు కారణంగా అనేక హత్యలు కూడా జరుగుతున్నాయి. ఎందరు ఆడపిల్లలు దానికి బలైపోతున్నారో మనం రోజూ చూస్తూనే ఉన్నాం. ఎందరు దాని కారణంగా పెండ్లికాకుండా అలానే ఉండిపోతున్నారో గమనిస్తూనే ఉన్నాం. జహేజు విషయమై ఉలమా (ధార్మిక పండితులు) ప్రతికాలంలోనూ, 'అది తీసుకోవడం నిషిద్ధం' అని చెబుతూనే ఉన్నారు. 'ఫతావా ఆలంగీరీ'లో స్పష్టమైన ఆదేశాలు ఈవిధంగా ఉన్నాయి.

"ఏ స్త్రీకైనా జహేజు తెమ్మని బలవంతం చేయడం సరైందికాదు. అది ఆమెకు ఇచ్చిన మహర్ ధనం నుండైనాసరే. మహర్ అయితే పూర్తిగా ఆమె సొత్తే. ఆమె అందునుండి తన ఇష్టానుసారం ఎలాగైనా ఖర్చుపెట్టుకోవచ్చు." 'ఫికహ్ అల్ మజాహిబుల్ అర్బఆ'లో ఇలా ఉంది.

"ఎవరైనా ఓ వెయ్యి రూపాయలు మహర్‌గా స్త్రీకి కట్టి పెళ్ళాడి

అతను ఆ మొత్తానికి బదులు ఓ పెద్ద మొత్తంలో జహేజు వస్తుందని ఆశించగా, ఆమె అంత జహేజు తీసుకురాకపోతే, దాన్ని తీసుకురమ్మని బలవంతం చేసే హక్కు భర్తకులేదు. భార్యకోసం అన్ని సదుపాయాలతో కూడిన ఇంటిని సమకూర్చడం మగవానిపై వాజిబ్ (తప్పనిసరి)." (సంపుటం 2- పుట 176)

"స్త్రీకి జహేజు సామానులు తీసుకురమ్మని లేదా తానుకట్టిన 'మహర్'కు సరిపడా జహేజు కావాలని లేదా మరే సొమ్ము ద్వారానైనా దాన్ని సరిపుచ్చుమని భర్త బలవంతం చేయడానికి వీల్లేదు. భర్తకట్టిన మహర్ పూర్తిగా ఆమె సొంత సొత్తే. అందులోనుండి ఆమె ఏ విధంగానైనా ఖర్చుపెట్టుకోగలదు." (అల్ ముహ్లా- 6/618)

జహేజుకు సంబంధించిన అనేక రకాల్లో ఓ రకం 'తిలక్' (దాన్నే మనం వరకట్నం అంటున్నాం) నేడు తిలక్ పేరుమీద బోలెడు డబ్బు, ఎనలేని వస్తువులు వసూలు చేయడం జరుగుతోంది. ఈ చెడు గురించి చెబుతూ మౌలానా బుర్హానుద్దీన్ సంభలీ ఇలా రాస్తున్నారు.

"కోరి అడిగే జహేజు మరింత చెడ్డది, ఇంకా చెప్పాలంటే సిగ్గు మాలిన సంప్రదాయం (తిలక్ లేదా ఇతర పేర్లతో పిలిచే సంప్రదాయం). ఇది దేశంలో చాలా చోట్ల నడుస్తోంది. ఇందులో, భర్త నిజంగానే కొనబడుతున్నాడు. ఈ సంప్రదాయం ఎంత నీచమైనదీ, మానవత్వం లేనిదంటే దాన్ని తెగడడానికి పదాలు కూడా దొరకవు. అయినా ఈ ఆచారం పరాన్నజీవి అయిన 'బదనిక'లా పెనవేసుకొనిపోతూనే ఉంది. అందుకని ముస్లిమ్ పండితులు, సంస్కర్తలు దాన్ని కూకటివ్రేళ్ళతో సహా పెకిలించ డానికి కృషి చేయవలసి ఉంది. అలా జరగని పక్షంలో దివ్యఖుర్ఆన్ నహ్ల్ సూరాలోని 25వ ఆయత్ (ఆ ఉపద్రవం నుండి మిమ్మల్ని మీరు

కాపాడుకోండి. దానివల్ల కలిగే హాని ప్రత్యేకంగా మీలో పాపం చేసినవారికే పరిమితమై ఉండదు)లో చెప్పబడిన శాపం ప్రతి మేధావిని వణికించడానికి సరిపోతుంది.

ఈ దుష్ట సంప్రదాయాన్ని తెగడడానికి సరైన పదాలు లభించడం లేదు. దానిపట్ల వివక్ష జూపడంగాని, అటువైపుకు దృష్టిని మళ్ళించక పోవడంగాని, సంఘసంస్కర్తలకు, ఉలమాలకు పొసిగే విషయంకాదు. ఎందుకంటే ప్రతిచోటా వేలాదిమంది కన్యలు, ముఖ్యంగా చదువుకున్న అమ్మాయిలు పెళ్ళికాకుండా ఉండిపోతున్నారు. వారిలో కొందరు ఆత్మహత్యలకు కూడా పాల్పడుతుంటే మరికొందరు తమ ధర్మాన్ని వదిలేసి ఇతర మతస్తులతో లేచిపోవడం కూడా జరుగుతోంది. అటువైపుకు దృష్టిని సారించకపోతే ఇలాంటి సంఘటనలు మరెన్నో పెరిగిపోగలవు. ఆ బాధ్యతనుండి ముస్లిములు, ప్రత్యేకంగా పలుకుబడి కలిగిఉన్న మేధావులు తప్పించుకోలేరు." (జహేజ్ యా నగద్ రఖమ్‌కా ముతాలిబా, పేజి- 23)

ప్రొ॥ ఉమర్ హయాత్ ఖాన్ ఘోరి ఇలా రాస్తున్నారు:

"మన సమాజపు ధనవంతుల ఈ దుబారావైఖరి సమాజంలో అనేక చిక్కులకు తావునిస్తోంది. అబ్బాయి తరఫువారు తమ కుమారుని పెళ్ళికి ముందే అమ్మాయి తరఫువారు ఎంత జహేజు ఇస్తున్నారు? కట్నంగా ఎంత డబ్బు ముట్టజెపుతున్నారు? అని ఆరా తీయడం పెద్ద ప్రమాదకరమైనది. రెండవది, నిరుపేద కుటుంబాలకు చెందిన అబ్బాయిలు తమకంటే ధనవంతులైన వారి ఇండ్లపై దృష్టిని పెట్టడం. దీనికారణంగా నిరుపేద కుటుంబాల్లో జన్మించిన ఆడకూతుళ్ళు పెండ్లికాకుండా ఉండిపోతున్నారు.

చివరికి వారి యవ్వనం కూడా అడవిగాచిన వెన్నెల్లా గడిచిపోతుంది. అయినా వారికి భర్త లభించడంలేదు. మూడవ నష్టం ఏమిటంటే, పేదవారు కూడా పెళ్ళిళ్ళలో తమ స్తోమతకు మించి ఖర్చుబెట్టడానికి వివశులైపోవడం. దీనికోసం వారు బోలెడు అప్పు చేయవలసివస్తోంది. ఓవైపు ఆ అప్పును తీర్చడానికి శ్రమపడుతూ చివరికి నిర్వీర్యం అయిపోతుంటే, మరోవంక తమ ఆస్తికి వారసులు కాబోయే వారి హక్కుల్ని కాలదన్ని ఉన్న ఇల్లు, ఆస్తుల్ని అమ్మివేయవలసి వస్తోంది. అందుకని ఆడపిల్లల పుట్టుక వారికి ఓ శాపంగా మారిపోయింది. ఈ రకంగా చూస్తే, మన ధనవంతులు ఓవిధంగా పాపపంకిలంలో కూరుకుపోతున్నట్లే." (అఫ్కారెమిల్లీ సంపుటం 12, సంచిక2,3 పుట 137)

తాను రాసిన మరో పుస్తకంలో ప్రొఫెసర్‌గారు ఇలా అంటారు:

"జహేజు దురాచారాన్ని అమలుచేస్తూ అబ్బాయి తరపువారు ఎలాగూ అధర్మంగా ప్రయోజనం పొందుతూనే ఉన్నారు. అమ్మాయి తండ్రి కూడా ఆమె పుట్టినప్పటినుండే ఆమె జహేజు కోసం సాధ్యమైనంత ఎక్కువ డబ్బు సంపాదించే తాపత్రయంలో పడిపోతున్నాడు. తాను తన కూతురి భర్తను కొనడానికి, ఆ సంపాదన ధర్మసమ్మతమైందా కాదా అన్న ఆలోచన లేకుండా అనేక అపమార్గాలను త్రొక్కవలసి వస్తోంది. అందుకు అతను అమలుచేసే మార్గాలన్నీ పాపభూయిష్టమైనవే. ఈరకంగా ఈ నేరం ఎనలేని సామాజిక నేరాలకు మార్గం తెరుస్తోంది. ఈరకంగా అతని నడవడి, ధార్మికత నాశనం అయిపోతోంది. ఈ మార్గాలు అవలంబించడం వలన ఆ ప్రభావం పూర్తి ముస్లిమ్ సమాజంపైన్నే పడుతోంది. అధర్మమార్గాల ద్వారా సంపాదించడం ప్రజల అలవాటుగా మారిపోయింది." (ఇస్లామీనిజామె మాషిరత్ అవుర్ జహేజ్‌కీ రఖం: పుట 47)

జహేజు చేసే వినాశనం ఎలాంటిదో తెలియజేస్తూ మౌలానా అబ్దుర్రహ్మాన్ కోందూ ఇలా రాస్తున్నారు:

"జహేజ్ రుగ్మత ఎంత పెరిగిపోయిందో తెలిపేందుకు ఎన్ని గ్రంథాలు రాసినా సరిపోవు. ప్రస్తుత పరిస్థితులు ఎంత భయంకరంగా మారిపోయాయంటే, జహేజు డిమాండుకు భయపడి చదువుకున్న కుటుంబాలకు చెందిన పడతులు తమ భవిష్యత్తుపట్ల నిరాశానిస్పృహలకు లోనై విషం త్రాగో, ఉరేసుకునో, అగ్నికి ఆహుతయ్యో అసువులు బాయడం జరుగుతోంది. జహేజు పేరున ఓ అమ్మాయి, ధనం మరియు సమస్త వస్తుసామాగ్రులను కుప్పగా పోయనంతమట్టుకు ఆమెను పెళ్ళాడేవాళ్ళే అగుపడడం లేదు." (ఫిత్నయె జహేజ్, పుట- 18)

జహేజు అనేది ప్రకృతికి విరుద్ధమైన ఓ తప్పుడు ఆచారం అన్నది యదార్థం. మానవనైజం ప్రకారం సంపాదించే బాధ్యత పూర్తిగా పురుషునిదే. స్త్రీ తనవెంట ఏదో డబ్బు తెస్తుందని ఎదురుచూడడం పురుష నైజానికి విరుద్ధం. అంటే అతని పౌరుషత్వానికి, మగతనానికి తగినదికాదు. నేడు సమాజంలో ఈ దుబారా ఏ రూపాన్ని సంతరించుకుందో దాన్ని సరిఅయిందిగా చెప్పే ఏ ఆధారం మనకు లభించదు. అందుకని అనేకమంది మేధావులు, రచయితలు దీన్ని అధర్మమైన ఆచారంగా ఖరారు చేయడం జరిగింది. జహేజు ద్వారా ఏ ఆదాయం లేదా నగదు అయితే వస్తుందో అది హరామ్ సొమ్ముగా ధార్మికవేత్తలు చెప్పడం జరిగింది. దీన్ని ఉపయోగించుకోవడం, దాన్నుండి ప్రయోజనం పొందడం నాజాయిజ్ (ధర్మసమ్మతం కానిది). ఈ సొమ్మును గ్రహించేవాడు, దాన్ని ఇచ్చేవాడూ ఉభయులూ పాపాత్ములే. అంటే, ఇది పూర్తిగా అధర్మమైన సంపాదన అని. మౌలానా దాని గురించి ఇంకా ఇలా రాస్తున్నారు.

"ఈ డిమాండ్ల ద్వారా ఏ డబ్బైతే లభిస్తోందో అది షరీఅత్ ప్రకారం లంచమే అవుతుంది. దాన్ని పొందడం లేదా దాన్ని ఇవ్వడం రెండూ హరామే (నిషిద్ధమే). అల్లామా షామీ (రహ్మలై) ఈ సొమ్మును 'సిహ్త్' అనడం జరిగింది. 'రిబా' (వడ్డీ) మరియు 'సిహ్త్' గురించి దివ్యఖుర్ఆన్‌లో యూదులను తెగడడం జరిగింది. అలాగే వారు తమ ప్రవక్తలను హతమార్చారని చెబుతూ, వారిపై తీవ్రమైన శిక్ష పడుతుందని హెచ్చరించడం జరిగింది. 'సిహ్త్' గురించి దైవప్రవక్త(స)వారి ప్రవచనం ఇలా ఉంది.

"'సిహ్త్' (అంటే హరామ్‌సొత్తు)ను ఉపయోగించిన వానికి నరకాగ్నే సరైన శిక్ష" (మిష్కాత్)

అలాగే మరో ప్రవచనంలో ఇలా ఉంది:

"హరామ్ ఆహారం తిని పెరిగిన శరీరం స్వర్గంలో ప్రవేశించదు" (మిష్కాత్, బైహకీ ఆధారంగా)

అంటే దాన్ని ఉపయోగిస్తున్నంతమట్టుకు అతను పాపాత్మునిగానే ఉంటాడన్న మాట. ఎవరిలోనైనా ఏమాత్రం ధార్మికజ్ఞానమున్నా అతను తన జీవితాంతం హరామ్ సొత్తును అనుభవిస్తూ పాపాత్మునిగా ఎలా ఉండగలడు? హరామ్ (నిషిద్ధ) మార్గంలో సంపాదించిన వస్తువులను ఉపయోగించేవాని నమాజ్, దుఆలను అల్లాహ్ స్వీకరించడు అని చెప్పడం ఇక్కడ అసందర్భ విషయం కాదేమో! పరలోకంపై పూర్తి విశ్వాసం కలిగి తాను జీవితాంతం చేసిన నమాజ్‌లకు, దుఆలకు పూచికపుల్లంత విలువ కూడా లేకుండా, దేవుని ఎదుట ప్రవేశింపబడడాన్ని ఎవరైనా ఒప్పుకుంటారా? అలా జరుగకూడదు అని అనుకుంటే ఇలాంటి హరామ్ సొమ్ముకు దూరంగానే ఉండాలి. మరింత జాగ్రత్తను వహించాలి. ఎందు

కంటే పాము, తేలు లాంటి విషజంతువుల ప్రభావం ఈ ప్రపంచంమట్టుకే పరిమితం. హరామ్ సొమ్మువలన బయల్పడే ప్రభావాలు ఈ లోకంలోనే కాకుండా పరలోకం వరకు కొనసాగుతాయి.

ఇక్కడ మరో హదీసును ఉటంకించడం సందర్భోచితమే అవుతుంది. ఆ హదీసులో చెప్పబడిన విషయం ఏమిటంటే, షరయీయేతర (ధర్మసూత్రాలుకాని) మార్గాల ద్వారా పొందిన ధనంలో శుభం అనేదే ఉండదు. అంటే, అది త్వరలోనే హరించుకుపోతుంది. ఇంకా చెప్పాలంటే, అది తనవెంట బోలెడు ప్రాపంచిక కష్టనష్టాలను గొనివస్తుంది. సదఖా (దానం) సాధారణంగా కష్టాలను గట్టెక్కించడానికి తోడ్పడుతుంది. అయితే ఇలాంటి ధనం ద్వారా చేసిన సదఖా మాత్రం అసలే స్వీకరించబడదు." (జహేజ్ యా నగద్ రఖమ్ కా ముతాలిబా పేజీ. 24, 25)

"నేను ముస్లిమ్ సమాజానికి చెందిన వ్యక్తిని" అని భావించే ప్రతివ్యక్తీ, ముఖ్యంగా భారతీయ ముస్లిమ్ తాను తన పరలోకాన్ని ఎక్కడైనా పాడుచేసుకోవడంలేదు కదా అని ఆలోచించవలసి ఉంది. ప్రపంచంలో కానవచ్చే ఈ ధనం జిగిబిగులు కేవలం మూణ్ణాళ్ళ ముచ్చట మరియు మృగతృష్ణే. దానిగురించి అతను ఆలోచించాలి. ఇది పరిణామం రీత్యా వెలుగు ఎన్నటికినీ కాదు, సరికదా అది కేవలం ఒక అంధకారం మరియు దైవశిక్షే.

ఇలాంటి పరిస్థితుల్లో ఈ సంక్షోభానికి అడ్డుకట్ట వేసేందుకు కృషి చేయడంలో ముస్లిమ్ మేధావులు మరియు నాయకుల బాధ్యత ఎంతైనా ఉంది. వీరు వివిధ రీతుల్లో ఈ జహేజు రుగ్మతను మనుషులకు తెలియ చేయాలి. దానికి అడ్డుకట్టవేసేందుకు వివిధ రకాల ప్రతిపాదనలను

ప్రజలముందు పెట్టవలసి వుంది. ఈ రుగ్మతను రూపుమాపే బాధ్యత నంతా కొందరు ముస్లిమ్ పర్సనల్‌లాపై వేస్తే మరికొందరు ఇస్లామీయ జమాఅత్‌లపై వేసి అవే దానికి పరిష్కారం కనుగొనాలని అంటారు. అయితే ఇది ప్రతి ముస్లిమ్ బాధ్యత. దీన్ని రూపుమాపడానికి సరైన విధానం ఏమిటంటే, ధార్మిక పండితులు (ఉలమా), వివేకులైన ముస్లిమ్ పెద్దలు తమ ధార్మిక హితబోధనలు, ప్రసంగాల ద్వారా, దీనివల్ల ఒనగూడుతున్న పాపం ఎలాంటిదో తెలియజేయవలసి ఉంటుంది. ఈ దురాచారాన్ని త్యజించేందుకు ప్రజలను ప్రోత్సహించవలసి ఉంటుంది. అదేకాకుండా వారు కూడా ఓ ఆదర్శంగా నిలిచి దురాచారాన్ని అంతమొందించాల్సి ఉంటుంది. సంపన్నులు చేసే పెళ్ళిళ్ళలో ఎక్కడైనా ఇలాంటి దురాచారం ఉందనిగ్రహిస్తే వారు ఆ వివాహాల్లో పాల్గొనకపోవడమే కాకుండా తాము అందులో ఎందుకు పాల్గొనడం లేదో, ఇలాంటి పెండ్లిళ్ళలో ఇస్లామీయ విలువలు ఎలా పరిహాసానికి గురైపోతున్నాయో వివరంగా చెప్పాల్సి వుంటుంది. అలా పకడ్బందీగా కృషి జరిగినట్లయితే ఈ ఉపద్రవం సమసిపోగలదు. ఇదో అంటువ్యాధి. ఇది ప్రతి వ్యక్తినీ పట్టిపీడిస్తున్నదే. ఆవిధంగా దాన్ని అంతమొందించవచ్చు.

## మీరాస్ పంపకం (మృతుని ఆస్తిపంపకం)- ఇస్లామ్ దృక్పథం

ముస్లిమ్ సమాజంలో, ముఖ్యంగా భారతీయ ముస్లిముల్లో వేళ్ళూనుకొనిపోయిన రుగ్మత వివాహాది శుభకార్యాల్లో 'దుబారా' మట్టుకే పరిమితంగా లేదు. కొన్ని సమస్యలైతే అల్లాహ్ దివ్యగ్రంథమైన ఖుర్‌ఆన్‌లో నిర్దేశించిన ఆదేశాలను పూర్తిగా ఉల్లంఘించడంలాంటివి కూడా ఉన్నాయి. వీటిలో 'మీరాస్' (ఆస్తిపంపకం) సమస్య ఒకటి. ముస్లిములు బాహాటంగా

ఉల్లంఘిస్తూంచే ఈ ఆదేశాలు భారతీయం ముస్లిముల్లో అనేకం జరిగిపోతున్నాయి. మృతుని ఆస్తిపంపకం అసలు షరీఅత్‌కు అనుగుణంగా జరుగడంలేదనేది ఒకటైతే ఎక్కడన్నా అలా పంపకం జరుగుతోంది అని అనుకున్నా, అందులోనూ ఇస్లామీయ వారసత్వ పంపక విధానం అసలే కానరాదు. అదంతా 'అజ్ఞాన కాలం'లో పంచబడిన విధంగానే పంచుకో బడుతోంది. దీనిగురించి దైవప్రవక్త(స) వారి ప్రవచనం ఇలా ఉంది.

"'ఏ మీరాస్ అయితే అజ్ఞానంగా పంచుబడుతుందో ఆ మీరాస్, (ఇస్లామ్‌కు పూర్వపు) అజ్ఞానకాలంలో పంచబడే మీరాస్ లాంటిది" (ఇబ్నెమాజా)

ఆస్తిపంపకం సమస్య మన సమాజంలో ఎంత క్లిష్టంగా మారి పోయిందంటే, ఆ పాపానికి ప్రతివాడూ పాల్పడుతున్నాడు. ఆడపిల్లలకు ఆస్తి దక్కకుండా చేయడం జరుగుతోంది. అయితే దీని చెడు పరిణామాలు శాశ్వతమైన అంటురోగంగా అందరికీ సోకుతున్నాయి.

ఆడపిల్లలకు ఆస్తి దక్కకుండా చేసే ఏ పంపకమైన, ధర్మసమ్మ తంగా ఆ ఆస్తి దక్కవలసినవారికి దక్కకుండా చేసే ఏ ప్రయత్నమైనా పూర్తిగా హరాం మరియు నిషిద్ధం. దైవం ఆస్తిపంపకం ఎలా జరగాలో వివరంగా తన గ్రంథంలో సూచించడం జరిగింది. దానికి విరుద్ధంగా ఎవరైనా ఆ ఆస్తిని పంచినట్లయితే వారికి కఠిన శిక్ష పడుతుందని హెచ్చరించడం జరిగింది. దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఆదేశం ఇలా ఉంది.

**"వమఀయ్ యాసిల్లాహ వ రసూలహూ వ యతఅద్ద హుదూదహూ యుద్‌ఖిల్‌హు నారన్ ఖాలిదన్ ఫీహా వలహూ అజాబుమ్ ముహీన్"**

**(అన్నిసా-14)**

**"అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకూ అవిధేయత చూపుతూ, అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించేవాణ్ణి అల్లాహ్ అగ్నిలో బడవేస్తాడు, అందులో అతడు సదా ఉంటాడు. అతనికి మిక్కిలి అవమానకరమైన శిక్ష పడుతుంది."**

ఇదే ఆయత్‌లో, అల్లాహ్ ఆదేశాలకు అనుగుణంగా ఆస్తిపంపకం చేయనివారిపై అల్లాహ్ క్రోధం గురించి చెప్పడం జరిగింది. ఈ ఆయత్‌కు సంగ్రహణాన్నిస్తూ ప్రముఖ ఇస్లామీయ తత్వవేత్త మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ తన గ్రంథం తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్‌లో ఇలా రాశారు.

"స్పష్టంగా తన గ్రంథంలో దైవం నిర్దేశించిన 'విరాసత్' చట్టాన్ని మార్చివేసేవారు, ఆ చట్టపరిధులను అధిగమించేవారందరికి ఎడతెగని నరకయాతనలుంటాయని హెచ్చరించే భయంకరమైన ఆయత్ ఇది. అయితే ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఇంత కఠిన హెచ్చరిక చేసినప్పటికి ముస్లిములు పూర్తిగా దైవభీతిలేని యూదుల్లా ప్రవర్తిస్తూ దైవాదేశాలను మార్చివేశారు. ఆయన నిర్ణయించిన హద్దులను అతిక్రమించారు. ఆయన ఆదేశించిన వారసత్వ చట్టం విషయంలో అనేక ధిక్కారాలకు పాల్పడ్డారు. ఇదంతా దైవానికి వ్యతిరేకంగా చేసే తిరుగుబాటు లాంటిది. ఓ చోట స్త్రీలకు వారసత్వపు వాటా దక్కకుండా చేస్తూ ఉంటే మరోచోట కేవలం పెద్ద కుమారునికే వారసునిగా ఖరారు చేయడం జరుగుతోంది. ఇంకోచోట ఆ ఆస్తిపంపకాన్నే వదిలేసి ఉమ్మడి కుటుంబ ఆస్తి అనే విధానాన్ని అనుసరించారు. మరోచోట, స్త్రీపురుషుల ఆస్తిహక్కుల్ని సమం చేశారు." (తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్ సంపుటం-1, పుట 320)

ఆస్తిపంపకానికి సంబంధించిన దైవాదేశాలు 'యూసీకుముల్లాహ్' అనే పదంతో ప్రారంభం అవుతాయి. వాటిగురించి అవలంబించే ఉపేక్ష, ఆ ఆదేశాలను ధిక్కరించడం లాంటిదే. ఇది చాలా ప్రమాదకరమైన వైఖరి. ఇటు ఇహం, అటు పరం రెంటిలోనూ కలహకారణమయ్యేది. అల్లాహ్, వారసులకు ఏయే భాగాలనైతే ఖరారు చేశాడో అవి సరైనవి మరియు దేవుని వివేకంపై ఆధారపడినవీను. వీటిలో ఎలాంటి మార్పులు చేయడం గాని, వాటిని ఉపేక్షించడంగాని పూర్తిగా నిషిద్ధమైన విషయం. అంటే, దైవదాసుల హక్కుల్లో ఏది ప్రయోజనకారో, మరేది ఇహపరలోకాల సాఫల్యాన్ని కలిగిఉందో అది దైవానికే బాగా తెలుసు. ఆయన యొక్క ఆ ఆదేశాలను దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. కాబట్టి మానవులు తమకు శ్రేయం కలిగించే మార్గాన్నే ఎంచుకొని నష్టాన్ని కలిగించే మార్గానికి దూరంగా ఉండాలి. అసలైన శ్రేయం ఇందులోనే ఉంది. ఇది తప్ప తక్కిన మార్గాలన్నీ మనిషి వినాశనాన్ని కోరేవే.

ఆస్తి పంపకానికి సంబంధించిన ఇస్లామీయ ఆదేశాలు, దైవంచేత నిర్ణయించబడిన సూత్రాలు కొన్ని ఈ క్రిందివిధంగా ఉన్నాయి.

ఇస్లామ్ స్త్రీ భాగాన్ని పురుషుని భాగంలో సగంగా ఖరారుచేసింది. ఇంకోరకంగా చెప్పాలంటే, పురుషునికి వచ్చే భాగం, స్త్రీకివచ్చే భాగం కంటే రెండింతలు. ఇది సాధారణ ఆదేశం. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది.

**"మీ సంతానం విషయంలో అల్లాహ్ మీకు ఇలా ఆదేశిస్తున్నాడు. ఒక పురుషుని భాగం ఇద్దరు స్త్రీల భాగాలకు సమానం." (అన్నిసా- 11)**

ఇది సూత్రం. అయితే దీనికారణంగా చాలామంది, ఇస్లామ్‌లో స్త్రీ హక్కు పురుషుని హక్కులో సగమే కదా అని ఆక్షేపిస్తారు. చాలామంది

ముస్లిములు కూడా వీరు చేస్తున్న ఆక్షేపణల వలలో చిక్కుకొని వారికి వంతపాడుతూ ఉంటారు. ఇలాంటివారు తమను సెక్యులర్లమని, హ్యూమనిస్టులమని చెప్పుకునే ప్రయత్నం చేస్తూ ఉంటారు. అయితే గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే ఈ ఆస్తివిభజన (పంపకం) చేసస్తున్నది అల్లాహ్‌యే అన్నది. ఆయన ప్రతి విషయం గురించి తెలిసినవాడు. కాబట్టి ఆ ఆదేశాల్లో తప్పకుండా ఏదో ఒక ఔచిత్యం ఉండే ఉంటుంది. వీటిలో కొన్నిటి గురించి మనిషి కూడా అంచనా వేసుకోగలడు.

ఉదాహరణగా స్త్రీపై ఆర్థికబాధ్యతలు అసలేలేవు. అలాగే స్త్రీ తాను సొంతంగా సంపాదించి బ్రతకాలన్నది కూడా ఆమె బాధ్యత కాదు. ఆమె మౌలికమైన ఖర్చులకు పురుషుడే బాధ్యత వహించవలసి ఉంటుంది. వారు తండ్రి అయినా, భర్త అయినా, మగసంతానమైనా సరే. అంటే ఆమె తన ఆర్థిక అవసరాల సమకూర్పుకు అతీతమైనది. పైగా, ఆమె ఆర్థిక భాధ్యతలు కూడా ఇతరులపైన్నే. ఇలా ఓ స్త్రీయొక్క ఆర్థిక అవసరాలు దాదాపుగా లేనట్లేలెక్క. దానికి భిన్నంగా పురుషునిపై ఉన్న బాధ్యతలు అనేకం. భార్య పోషణ, సంతాన పోషణ, సంపాదించే స్తోమతలేని తల్లి దండ్రుల పోషణాబాధ్యత కూడా పురుషునిపైన్నే పడుతుంది. ఈవిధంగా చూస్తే పురుషుని బాధ్యతలు బాగా పెరిగిపోతాయి. స్త్రీకి ఆ బాధ్యతలేవీ ఉండవు. ఈ నేపథ్యంలో గనక ఆలోచిస్తే స్త్రీకంటే పురుషునికి రెండింతల భాగం పంచడం సరైనదే. న్యాయమైనదే. ఇది సరైన విధానం కూడాను. స్త్రీపురుషులకు సమాన భాగాలు పంచాలని ఎవరైతే వాదిస్తున్నారో వారి వాదన ప్రకృతికి వ్యతిరేకమైన వాదన. అది పూర్తిగా అసహజమైనదీను.

ఇదేకాకుండా ఈ పంపకంలో మరో ఔచిత్యం కూడా ఉంది. స్త్రీకి రెండువైపులనుండి వాటా లభిస్తుంది. తండ్రి మరణానంతరం అతని

ఆస్తిలోనూ, భర్త చనిపోతే అతని ఆస్తిలోనూ ఆమెకు వాటా వస్తుంది. అంటే, ఇలా ఆమెకు రెండువైపులనుండి వాటా దక్కుతుందన్నమాట. అలా కాకుండా పురుషునికి దక్కేది ఒకవాటా మాత్రమే. అంటే తండ్రి ఆస్తినుండి వచ్చే వాటా అన్నమాట. ఇలా ఎవరికైతే ఆర్థిక బాధ్యతలు లేవో ఆమెకు రెండువైపులనుండి వాటా లభించడం, పురుషునికి ఒకరినుండే వాటా లభించడంలో ఏదో ఒక ఔచిత్యం ఉండాలి. ఇలా చూస్తే పురుషుని వాటా రెండింతలుగా ఉండడం సబబే.

పురుషుని బాధ్యతలు ఎన్నో రెట్లయినప్పుడు స్త్రీకంటే అతనికి కూడా ఎన్నో రెట్లు వాటా ఎందుకు లభించకూడదు? అనే ఆలోచన కూడా రావచ్చు. అలాగే మరో ఆక్షేపణ ఏమిటంటే భర్తపోయిన తరువాత భర్త ఆస్తిలో భార్యకు, భార్య మరణానంతరం ఆమె భర్తకు ఆమె మీరాస్‌లో భాగం లభించాలన్నది. ఈ రెండు ఆక్షేపణలు అర్థంలేని ఆక్షేపణలే. ఈ చిరుపుస్తకంలో వాటికి సమాధానం చెప్పడానికి వీలుపడదు.

మన సమాజంలో మీరాస్‌ని పంచే ఆనవాయితేలేదు. ఎక్కడైనా పంచడం జరుగుతూ ఉన్నా అందులో బోలెడు సమస్యలు ఎదురవుతున్నాయి. ఉదాహరణకు స్థిరాస్తిలో స్త్రీకి వాటా పంచడం జరగడంలేదు. కేవలం చరాస్తిలోనే ఆమె వాటా పొందుతూ ఉంది. ఇది ఎంతో ప్రమాదకరమైన పోకడ. ఆ మీరాస్‌లో ఆమెకు వాటా పంచిఇవ్వకపోవడం కూడా దైవాదేశాలను ధిక్కరించినట్లే. మృతుని 'తర్కా'ను (వదిలిపెట్టివెళ్ళిన ఆస్తిని) దైవాదేశాలకు అనుగుణంగా అతని వారసులకు పంచిపెట్టడం వాజిబ్. ఇందులో హెచ్చుతగ్గులు చేయడంగాని ఓ ప్రత్యేకమైన ఆస్తిని పంచిపెట్టకపోవడంగాని నిషిద్ధం. అందరికీ తగిన వాటాలు పంచిపెట్టడం

జరగాలి. అంటే మగపిల్లలకు వారివారి వాటా ప్రకారం, ఆడపిల్లలకు వారివారి వాటా ప్రకారం పంచిపెట్టడం అన్నమాట. అదేకాకుండా తల్లి, భార్య లేదా సంతానానికి వారికొచ్చే వాటా ప్రకారం పంపకం జరగాల్సిందే. అందులో హెచ్చుతగ్గులు చేయడం ఏమాత్రం కుదరదు.

అదేవిధంగా కొన్నిచోట్ల తాతముత్తాతలు కట్టించిన ఇళ్ళను పంపకం నుండి మినహాయించడం జరుగుతోంది. అందులో మగపిల్లలకు, ఆడపిల్లలకు ఏమాత్రం వాటా ఇవ్వరు. ఇది కూడా ధర్మసమ్మతమైంది కాదు. ఇతర వస్తువులు, సొమ్ముల్లా వారికి షరీఅత్ ప్రకారం ఏ వాటా ప్రకారం అయితే లభిస్తాయో అదేవిధంగా ఆ ఇండ్లలోనూ వారికి వాటా ఉంది. అయితే వాటి పంపకంలో ఏవైనా చిక్కులు ఏర్పడినప్పుడు, న్యాయంగా దానికి తగిన ఆస్తినిగాని, దానికి తగిన ధనంగాని వారికి పంచిపెట్టడం దైవాదేశాలకు భిన్నమైనదికాదు. దాన్ని వారికి దక్కకుండా చేయడం మట్టుకు నాజాయిజ్ (అధర్మం).

కొందరైతే ఆస్తిని షరీఅత్ ప్రకారమే పంచుతారు కాని ఆ ఆస్తిని ఎవరో ఒక సోదరునికి ఇచ్చేయమని అక్కాచెల్లెళ్ళను బలవంతబెడతారు. ఇలా ఆస్తిపంపకమైతే జరిగిందికాని కార్యరూపంగా ఆడపిల్లలకు వారి వాటా దక్కడంలేదు. ఈ తీరుకూడా ధర్మసమ్మతమైనదికాదు. దైవాదేశాలను అవహేళనకు గురిచేయడంలాంటిదే ఇది. దైవం, ఎవరికి ఎంత వాటా అయితే నిర్ణయించాడో ఆ వాటా వారికి తప్పకుండా దక్కవలసిందే. ఏ పేరు పెట్టయినా దాన్ని హరించడం సరికాదు.

ఆస్తి పంచేటప్పుడు కొన్ని సందర్భాల్లో ఇస్లామ్ 'మనువడి'కి వాటా దక్కకుండా చేస్తుంది అని కొందరు ఆక్షేపిస్తారు. ఇలాంటి వాదనగాని,

ఆక్షేపణగాని సరైందికాదు. మౌలానా అస్లమ్ జైరాజ్ పూరి అయితే ఈ విషయమై ఓ గ్రంథమే రాస్తూ, "మనవనికి ఏ సందర్భంలోనూ ఆస్తి దక్కకుండా చేయలేము" అని చెప్పడం జరిగింది. ధర్మవేత్తలందరూ కలిసి ఏకగ్రీవంగా ఆమోదించిన విషయం ఏమిటంటే, ఏ వ్యక్తి యొక్క కుమారులు బ్రతికి ఉండగా ఆ కుమారుల కుమారులకు (అంటే మనవలకు) వాటా లభించదో ఆ మనవడు ఆ తరువాత అనాథగా మిగిలినా సరే అతనికి వాటా లభించదు. ఒకవేళ అతని తండ్రి బ్రతికి ఉండి ఉన్నట్లయితే ఆ తండ్రి తన సోదరులతో సహా తండ్రి ఆస్తిలో వాటాదారుడై ఉండిఉండేవాడు. కాని ఇప్పుడు ఆ మనవని తండ్రి బ్రతికిలేనందున అతని కుమారుడు ఆ స్థానాన్ని భర్తీ చేయలేడు. ఇది అందరికి తెలిసిన ప్రసిద్ధ సమస్యే. దానిపై అనేకులు తమ సలహాలను వెలిబుచ్చడం కూడా జరిగింది. మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ(రహ్మలై) తమ గ్రంథం, 'రసాయిల్ వ మసాయిల్' రెండవ భాగంలో ఈ విషయాన్ని వివరంగా చర్చించారు. ఆ చర్చను ఇక్కడ ఈ క్రింద రాయడం జరుగుతోంది. మౌలానా ఇలా రాస్తున్నారు:

"తాత బ్రతికి ఉన్నప్పుడు తన తండ్రిని పోగొట్టుకున్న మనవనికి (అంటే అనాథ అయిన మనవనికి) తాత ఆస్తిలో వారసత్వం హక్కులేదు. ఇది ఇస్లామ్ ధార్మిక పండితులంతా ఏకగ్రీవంగా ఒప్పుకొని ఖరారుచేసిన విషయం. ఆ ఆస్తికి వారసులు ఆ మనవని పినతండ్రులు (తండ్రి అన్నదమ్ములు) మాత్రమే. అయితే ఇప్పటివరకు దివ్యఖుర్ఆన్ గ్రంథంలో గాని, హదీసుల్లోగాని దానికి సంబంధించిన స్పష్టమైన ఆదేశం ఏదీ లభించలేదు. అయినా ధార్మిక పండితులందరూ అప్పటినుండి

ఇప్పటివరకూ అదే విషయాన్ని చెప్పుకువస్తున్నారు. అందుకని దానికి వ్యతిరేకంగా ఎలాంటి అభిప్రాయాన్ని వెలిబుచ్చడం సరైందికాదు. అయినా బాగా ఆలోచిస్తే, వీరి వాదనే బలమైన వాదనగా అనిపిస్తోంది. ఎందుకంటే, మనవడు ఎలాగూ తన తండ్రి మాధ్యమంగానే తాత ఆస్తికి వారసుడవుతాడు. అంతేగాని నేరుగాకాదు. ఒకవేళ ఓ వ్యక్తి కుమారుడు, ఆ వ్యక్తి బ్రతికి ఉండగానే చనిపోయి, అతనికి పెండ్లికూడా కాకపోతే ఆ తండ్రి ఆస్తిలో వాటా ఏదీ లభించదు అని మీరే అంటారు. అలాంటప్పుడు అతని మరణానంతరం ఇదివరకే చనిపోయిన కుమారుని కుమారునికి వాటా లభిస్తుందని ఎలా చెప్పగలరు? అతని వాటాకు వచ్చే ఆస్తి మొత్తం అతని సోదరులు, తల్లి వగైరాలకే చెందుతుంది. అదేవిధంగా చనిపోయిన కుమారునికి భార్య కూడా ఉండిఉంటే, ఆమె తన మామ ఆస్తికి వారసురాలు కాదు అని మీరే అంటారు. ఆమెకు రెండవ పెళ్ళి జరిగినా, జరగకపోయినా సరే. అలాంటప్పుడు మనవడు బ్రతికిఉంటే, తాత ఆస్తిలో చనిపోయిన తన తండ్రికి వచ్చేవాటా మనవనికే రావాలని మీరెందుకు పట్టుబడుతున్నట్లు?

ఇకపోతే అనాథ బాలుని పోషణ విషయం. షరీఅత్ ప్రకారం ఆ అనాథ బాలుని పోషణ బాధ్యత అతని పినతండ్రులు లేదా సంరక్షకులది. అతని పోషణకు వీలుకల్పించేవారు వారే. అదేకాకుండా, షరీఅత్ (ధర్మశాస్త్రం) 'వసీయత్' (వీలునామా) చేసే ఆదేశం ఇచ్చింది అందుకోసమే. దానిప్రకారం చనిపోతున్నవారు తమ మరణశాసనంగా కొంత ఆస్తిని లేదా సొమ్మును తన కుటుంబంలో కొందరికి చెందాలని వసీయత్ చేసి వెళ్ళవచ్చు. అతని ఆస్తిలో మూడింట ఒకవంతు (అంటే 1/3) మట్టుకు అలా వసీయత్ ద్వారా ముట్టజెప్పవచ్చు. ఎవరైనా అనాథ మనవణ్ణి లేదా ఎలాంటి ఆధారంలేని వితంతుకోడలు లేదా సోదరిలాంటివారిని వదిలిపెట్టి

వెడుతూ అతని ఆస్తిలో 1/3 వంతు వారికి ఎంతెంత దక్కాలో వసీయత్ చేసి వెళ్ళవచ్చు. షరీఅత్ ఈ వెసలుబాటును పెట్టింది- వారసులు కాకుండా ఉండే కుటుంబంలోని ఆపన్నులను ఆదుకోవడానికే."

ఈరోజుల్లో షరీఅత్ ఆదేశాలకు వ్యతిరేకంగా ఆస్తిపంపకం జరిగి పోవడం ఒకటైతే దానికితోడు ప్రజలు తమ జీవితకాలంలోనే వారి ఆస్తిపాస్తులను పంచిపెట్టే సంప్రదాయం ఒకటి. ఇది కూడా తప్పుడు విధానమే. మనిషి బ్రతికి ఉన్నంతకాలం అతని ఆస్తికి ఎవ్వరూ వారసులు కాజాలరు. ఎవరైనా కొంత డబ్బును 'హిబా' చేయడం (బహుమానం ఇవ్వడం)తప్ప. అయితే, తాను తన ఆస్తిని మాత్రం పంచడానికి వీల్లేదు. అతను తన సంతానానికి షరీఅత్ ప్రకారమే ఆస్తిని పంచుకునేటట్లు శిక్షణ గరపవలసి ఉంటుంది. అతని బాధ్యత కేవలం తన తల్లిదండ్రుల ఆస్తిని షరీఅత్ ప్రకారం పంచుకోవడం, అంతేగాని తన ఆస్తిని పంచిపెట్టడం కాదు. అతను ఏ తీర్పులిచ్చినా షరీఅత్ ప్రకారమే తీర్పులు ఇవ్వాలి. అలా కాని పక్షంలో అతని ఆ ప్రవర్తన అంతా అతని ధార్మికతకు వ్యతిరేకమైనదిగానే ఉన్నట్లు.

ఇక్కడ ఎదురయ్యే మరో సమస్య ఏమిటంటే, ప్రజలు వసీయత్ ద్వారా తనకు అయిష్టమైన (సంతానం లేదా వారసులు) ఎవరో ఒకరికి తన ఆస్తిలో వాటా దక్కకుండా చేయడం. అతను తప్ప మిగిలిన అందరికీ మొత్తం ఆస్తిని రాసి పారేయడం. ఇది కూడా ధర్మసమ్మతంకాదు. సంతానపు ఏ హక్కులనైతే అల్లాహ్ నిర్ణయించాడో అతను వాటిని జవదాటడం లాంటిదే అది. అలాంటి వసీయత్‌కు విలువలేదు. పైగా ఓ వారసునికి ఎవరైనా వసీయత్ చేసి వెళ్ళడం సరికాదు, హదీసులో స్పష్టంగా, వారసునికి ఆస్తిని ముందే రాసిపెట్టడం సరైందికాదు అని చెప్పడం జరిగింది.

"అల్లాహ్ ప్రతివారసుని హక్కును నిర్ణయించాడు. అందుకని ఏ వారసుని పక్షంలో చేసినా వసీయత్ చెల్లదు." (అబూదావూద్, ఇబ్నెమాజా)

కొందరు తమ సంతానం యొక్క అవిధేయత మరియు పోకిరితనం కారణంగా అతనికి 'ఆఖ్' (Disinherit, ఆస్తి దక్కకుండా చేయడం) చేస్తారు. ఇది కూడా ధర్మసమ్మతం కాదు. సంతానాన్ని ఆఖ్ చేసి వారికి ఆస్తిని దక్కకుండా చేయడం సరైందికాదు. వారికి రావలసిన ధర్మసమ్మత మైన వాటా వారికి దక్కవలసిందే.

మొత్తానికి చెప్పవచ్చిందేమిటంటే, సంతానానికి వాటాలను పంచడం, దానికి తోడు వారసులకు కూడా భాగాలనివ్వడం దైవాదేశం. దీన్ని అమలు చేయడం వలన బోలెడు శుభాలు కలుగుతాయి. దీన్ని ఉపేక్షించడం, పరలోకంలో వినాశనాన్ని కొనితెచ్చుకోవడం లాంటిదే. అల్లాహ్ స్పష్టంగా తన గ్రంథంలో ఇలా సెలవిస్తున్నాడు:

**"ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపేవాణ్ణి క్రింద సెలయేరులు ప్రవహించే ఉద్యానవనాల్లో ప్రవేశింపజేస్తాడు అల్లాహ్. ఆ వనాలలో అతను కలకాలం ఉంటాడు. అసలు ఇదే గొప్ప సాఫల్యం. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకూ అవిధేయత చూపుతూ, అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించే వాణ్ణి అల్లాహ్ అగ్నిలో పడవేస్తాడు. అందులో అతడు సదా ఉంటాడు. అతనికి మిక్కిలి అవమానకరమైన శిక్షపడుతుంది."**

***(అన్నిసా- 13, 14)***

కాబట్టి వారసత్వం యొక్క సరైన పంపకాన్ని సమాజంలో అమలు పర్చడం, అల్లాహ్ దివ్యఖుర్ఆన్‌లో చెప్పిన హద్దులను జవదాటకుండా ఉండడం మొత్తం ముస్లిమ్ సమాజం బాధ్యత.

**- : సమాప్తం : -**